పులు', 'సంకీర్తనం', 'వైష్ణవము', 'మంగళము', 'పెండ్లికూతురు', 'పెండ్లి కొడుకు'వంటి మాటలతో ప్రతిపాద మంతమగు పాటలుకూడ కోలాటపాటలే. ఐనను అన్నమయ్య గారివి మాత్రము చతురశ్రగతి కోలాట పాటలే.

నాచన సోమనాథుడు చెప్పిన జాజర పాటకు అన్నమయ్య రచనములందు రెండు చక్కని యుదాహరణములు గలవు. వసంత విలాసమందలి పంక్తులను బట్టి వెన్నెల రాత్రులందు వీణాగానము, మరియు రమణుల పాటల మేళవింపుతో జాణలు మెచ్చునది ఆనాటి జాజరపాట. శ్రీనాథుని కాలమున వారుణీ రసాస్వాద మదాతి రేకముతో చంద్రికలు గాయు వీధుల కనక వీణలు మీటుచు భీమనాథుని జాదుర జాదురంచు అంగనలు పాడినది జాజరపాట. ఈ రెంటను జాజర యనగా నేమిటో యర్థము తెలియరాదు. అన్నమయ్యగారొక పాటలో 'పులకల మేనితొ బొరలెను కడుం జలిగొని చల్లకు జాజఱ' యను మాటలచే జాజర యనగా నెద్దియో చల్లెడు పదార్థమనియు, మరియొకచో 'సంకు మదంబుల జాజఱ' యను మాటలచేతను 'రవ రవ చెమటం గరిగి' యనుటచేతను జాజర యనునది పొడి యనియు, 'పుప్పొడి జారగ' యను మాటలచే కస్తూరి, గంధవొడి, పుప్పొడి మున్నగు వాని పొడి జాజర యనియు దీనిని చల్లుకొనుచు ఆడునట్టి యాట జాజర యాటయనియు తెలియుచున్నది. తెలంగాణమున 'కాముని పున్నమ' సందర్భమున 'జాజరాట' ఆడుట పరిపాటియే. రంగులు చల్లుకొనుట, కుంకుమ, బుక్క, గులాలు చల్లుకొనుట ఈ నాటికిని గలదు.

పాల్కురికి చెప్పిన 'ఆనంద పదము' రూపమెట్టిదో తెలియరాదు. 'వెన్నెల పదములు' 'వెన్నెల' యను మాటతో నంతమగు చరణముల పాటలో లేక వెన్నెలలో విలాసముగా పాడుకొను పాటలో తెలియరాదు. తెలంగాణమున కాముని పున్నమ సందర్భమున పాడబడు కొన్ని పాటలందు 'వెన్నియ్యలో' యని చివర నుండును. అన్నమయ్య వెన్నెలలో 'అల్లో నేరేళ్ళు' పాడుటను విలాసముగా పేర్కొనెను.

'నెయ్యములల్లో నేరెళ్ళో' వొయ్యన వూరెడి వువ్విళ్ళో' యను చతురశ్రగతి పాట 'అల్లోనేరెళ్ళ' కుదాహరణము. తెలంగాణమున 'నల్లో నేరెళ్ళ'పాట లధికముగా పాడబడును. అల్ల నేరెళ్ళు అల్లోనేరెళ్ళుగా మారినదని నా నమ్మకము. నేరెళ్ళు రెండు విధములు. తెలంగాణమున ప్రసిద్ధమైన పెద్దవైన-మంచి నేరెళ్ళను అల్ల నేరెళ్ళందురు, చిన్నవానిని కుక్క నేరెళ్ళందురు. కొన్ని ప్రాంతములందు కుక్క నేరెళ్ళకు కాకి నేరెళ్ళని కూడ పేరున్నట్లు తెలియచున్నది. అల్ల నేరెడి

యనగా ప్రసిద్ధమైన నేరెడు పండని యర్థము. ఈ మంచి నేరెడుపండు పేరేల గేయముల కెక్కెనో తెలియరాదు. 'ఫ్రక్కొళ్ళో', 'తొక్కొళ్ళో' యను పదాంత పదములు కూడ 'అల్లో నేరేళ్ళ' వంటిపాటలే. 'కలుపు తియ్యం డమ్మలారా-చేను-బలుపు చూడం డమ్మలారా' యను కర్షక గీతమునకు'అప్పమైన నియ్యారె యమ్మలారా నే, డప్పం దారగించె నదె అమ్మలారా' యను అన్నమయ్యాగారి పాట కలదు. దశావతారములను పేర్కొనుచు పాడెడి సంకీర్తనములును గలవు.

'చందమామ రావో, జాబిల్లి రావో-మంచి
కుందనంపు పైడి కోర వెన్నపాలు తేవో' యనునది పిల్లలపాట వరుస. ఆరేసి 'కిటతక' ఆవృత్తముల పాదములతో
'అంతట రాములవారూ అంగన సీతను గూడి
సంతస మందుచు వేగా స్వపురమునకు చనుదెంచి' యను స్త్రీలపాట వరుసలో అన్నమయ్యాగారు రచించిన
'సత్యము సేయగ వచ్చును, సర్వేశ్వర ఈ మాటకు
నిత్యము నీవే యెరుగుదు, నేనేమీయెరుగ జుమీ' యను పాట కలదు.

'తందనాన అహి తందనానె పురె
తందనాన భళా తందనాన' యను విలాసనృత్యపు పాట యొకటి కలదు. క్రీడాభి రామమందలి 'తందాన లమ్మయ్యకున్' అను మాటలవలన తందానలు కూడ గొబ్బిళ్ళకు వలెనే పూజలకు రూఢి పదములైనట్లు కానబడును. తెలుగుదేశమందంతటను నేడు వినబడు తందాన పదము లిందుకు సాక్ష్యములు. కాని పైన పేర్కొన్నది తందనాలాట; విలాస గేయము, చేతులు తట్టుచు పాడునట్టిది. 'వాడు తాగి తందనా లాడుతున్నా'డను మాట దీని వలననే పుట్టిన దనుకొందును.

అన్నమయ్యా గారి ఏలలు నా కంట బడలేదు. ఏల పదముల ప్రశంస సంస్కృత సంగీత గ్రంథములందు కలదు. 'ఏలలు వెట్టుచు నింపు సొంపార' బసవపురాణమును జదివెడు వారు పాల్కురికి కాలమున నుండిరి. కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు 'అప్పారావోయి ముద్దుల కుప్పా రావోయి' యనుదానిని ఏల పదమున కుదాహరణముగా నిచ్చిరి. కాని యది ఏల కాదు. రుద్రకవి సుగ్రీవ విజయములోని

'భాను వంశమూన బుట్టి - దానవ కామీని గొట్టి
మౌని వరులు సన్నుతింపగా - ఓ రామచంద్రా
పూని మఖమూ నిర్వహింపవా' యనునది ఏల పదము. ఇది 'తక కిటతక' యను గతిలో సాగిపోయినది. ఏగంటి వారి ఏలలు యక్షగానముల యందలి

ఏలలు కూడ ఇటులనే యున్నవి. శ్రీ కె. సభాగారు సేకరించి ప్రకటించిన ఏలలు కూడ ఈ రీతిగనే సాగి పోయినవి. తాళ్ళపాక చిన తిరుమలాచార్యులు సంబోధనము మించి ఏల లక్షణ మేమియును చెప్పలేదు. 'అప్ప' యన్న పై పాటలోని సంబోధనము మాత్రమే దాని నేలగా చెప్పుటకు చాలదు. తక్కిన ఏలలతో దాని కెట్టి పోలికయును లేదు. ఏలల నిర్మాణము అన్నమయ్య అభిమానించిన నిబంధపదముల నిర్మాణమున కందకపోవుటచేత నే కాబోలు ఏలలాతని రచనము లందు లేవు. ఐనను ఈ విషయ మింకను సూక్ష్మముగా పరిశీలింప దగినదే. అన్నమయ్య గా రెన్నియో విధముల దేశి వరుసలందు కీర్తనములు రచించిరని చెప్పుటకుమాత్రమే ఇటకొన్ని యుదాహరించితిని. ఇంకను ఎన్నియో తీరుల దేశి వరుసల నాతడు చేపట్టి యున్నాడు. వాని నన్నింటిని దడవినచో గ్రంథ విస్తరమగు నని విడుచుచున్నాను.






ఇంతవరకు జానపదగేయముల పుట్టుపూర్వములు, వాని లక్షణములు, వాని ప్రశస్తితోబాటు వాని భేదములు వానియందున్న విశేషములు మున్నగునవి తెలిసికొంటిమి. జానపదగేయ స్రవంతి యనంతము. నా నేర్చిన భంగి పదునారు దోసిళ్ళ పానీయ మెత్తగలిగితిని. ఒంటి మానిసి దాని కేత మెత్తజాలడు. పలువురు పండితులును, కవులును, విమర్శకులును నడుము గట్టిననేకాని ఇది యసాధ్యము. తెలుగుదేశమున నున్న నదీ నదములు సెలయేర్లు వాగులు వంకలు ఎంతగా వాడుకొనబడవలయునో నంతగా వాడుకొనబడక 'సాగరోగతిః' ఐనట్లే జానపదగేయ స్రవంతికూడ ఇప్పటికే చాల భాగము మనకు దక్కకుండ బోయినది. ఉన్నదానినైన నిక భద్రపరచి యుపయోగించుట తెలుగువారి కర్తవ్యము. పండితులు విమర్శకులు జానపద గేయములందున్న సాహితీ విషయము లెత్తి చూపవచ్చును. సామాజిక శాస్త్రవేత్తలా సంపదలో తమకు గావలసిన యమూల్య మణుల్వెదకవచ్చును. చేయి దిరిగిన కవులు రచయితలు కళాకారులు వానియందుపలబ్ధమగు దేశీయ వస్తు సంపదను దిద్ది తీర్చవచ్చును. శిష్టులగు రచయితలు పూర్వులు వస్తువునకై సంస్కృత విపణి వీధులందు చేజాచినటులే నవ్యులు పాశ్చాత్య వీధీ విహారము చేయు చున్నారు. తమకున్న దేశీయ సంపదను విడిచి 'పొరుగింటి పుల్లగూర' కాసించు చున్నారు. కీ. శే. బసవరాజు అప్పారావు, గురజాడ అప్పారావు, అడవి బాపిరాజు మున్నగువారలు కొలదిమంది మాత్రమే దేశీయ వస్తువును చేపట్టి ప్రజాభిమానమును చూరగొనిరి. నవ్యులందు శ్రీ కవికొండల వెంకటరావుగారు జానపదుల భాష, భావములు మరియు నితివృత్తమును సంపూర్ణముగా నాకళించుకొని రచనలు గావించి దేశికవితా విభూతిని ప్రదర్శించినారు. నండూరివారి 'యెంకిపాటలు' జానపదుల భాషలో ఉత్తమ కవితాకళ కేతా మెత్తి పట్టున్నవి. జానపద కవితారీతుల నందరికన్న నెక్కుడుగా సద్వినియోగము

చేసినవారు రాజకీయ పక్షములవారు. తమ తమ రాజకీయ సిద్ధాంత ప్రచారములకై బుఱ్ఱకథలు, జముకుల కథలు, గేయములు రచించిన వీరి యాశయము కొనియాడ దగినది. స్వరాజ్యోద్యమ సమయమున వెలువడిన ' మాకొద్దీ తెల్లదొరతనము ' ' దండాలు దండాలు భరతమాతా ' ' కొల్లాయి గట్టితేనేమీ ' వంటి రచనములు పూర్తిగా జానపదుల సొమ్మైపోయినవి. స్వరాజ్యోద్యమమునకు, సంస్కరణోద్యమమునకు తోడుపడిన గేయములు వందలకొలది వెడలినవి. వీని ప్రయోజనము తాత్కాలికమే యైనను ప్రభావము మాత్ర మనంతము. చేయిదిరిగిన రచయితలు జానపదగేయములందున్న వస్తువును ( రెండు, మూడు, నాలుగు, పదునొకండవ ప్రకరణములు చూడనగును ) స్వీకరించి కల మందుకొనవలె గాని రవ్వలు రాల్చవచ్చును. ఆంధ్రభాషామతల్లి కెనలేని తొడవులు సవదరింపవచ్చును. జానపద గేయము లందుండు జాతీయములు నానుడులు వింత వింత పలుకుబడులు శిష్టు లాకళించుకొనవలసిన యమూల్యసంపద. నవ్య భారత పునర్నిర్మాణావసరమున వివిధ ప్రణాళికా ప్రచారమునకును, ప్రజావబోధమునకును జానపద కవితారీతు లుపయోగించునంతగా నితరము లుపయోగపడవన్న నతిశయోక్తి కాదు. ఔత్తరాహులు ముఖ్యముగా హిందీ బెంగాలీ భాషలవా రీమార్గమున చాల దూరము సాగిపోయినారు. జానపదసారస్వతసంపద యందలి వైశిష్ట్యమును గమనించియే కేంద్రప్రభుత్వమువా రిటీవల రేడియో మున్నగు ప్రచార సాధనముల ద్వారమున నమితమగు సేవ చేయుచున్నారు. ఇరుగు పొరుగువారిని జూచి యైనను తెలుగువా రభినివేశము కల్పించుకొన్నచో నాంధ్ర దేశమునకు, నాంధ్ర భాషామతల్లికి, నాంధ్ర విజ్ఞానమునకు మేలగు నని సప్రశ్రయముగా నివేదించుచు విరమించుచున్నాను.



# తొలిపడిన గ్రంథములు

౧. అన్నమాచార్య చరిత్ర
౨. అప్ప కవీయము
౩. అమరావతీ స్తూపము
౪. ఆంధ్ర మహాభారతము
౫. ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి
౬. ఆంధ్రుల చరిత్ర ౫ వ సంపుటము
౭. ఆంధ్రుల సాంఘిక చరిత్రము
౮. ఆంధ్ర భాగవతము
౯. ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము
౧౦. ఆదిలక్ష్మీ విలాసము ప్రా.పు.భాం.
౧౧. కిన్నెర సంచికలు
౧౨. క్రీడాభిరామము
౧౩. కుమారసంభవము, తెలుగు
౧౪. గుజరాతీ వాఙ్మయచరిత్రము
౧౫. గృహలక్ష్మి సంచికలు
౧౬. గౌడ వంశోత్పత్తి మార్తాండము
౧౭. జాతిరత్నాలు
౧౮. జానపద గేయ వాఙ్మయ పరిచయము
౧౯. తాళ్లపాక వారి పాటలు, సంపుటములు, ౧, ౨, ౫, ౭
౨౦. తెలుగు హాస్యము
౨౧. దక్షిణ దేశ భాషా సారస్వతములు, దేశి
౨౨. దక్షిణ భారత శాసనములు, సంపుటి ౭, ౧౦
౨౩. నవచోళ చరిత్రము
౨౪. నవనాథ చరిత్రము
౨౫. నళ చరిత్రము, ద్విపద
౨౬. నారద భక్తి సూత్రములు
౨౭. నేటి కాలపు కవిత్వం
౨౮. పంచలింగాల కొండ యుద్ధము
౨౯. పండితారాధ్య చరిత్రము
౩౦. పలనాటి వీరుల కథలు
౩౧. పలనాటి వీర చరిత్ర, పీఠిక
౩౨. పూసపాటివారి కైఫీదు
౩౩. పెద్దాపుర సంస్థాన చరిత్రము
౩౪. ప్రతిభ సంచికలు
౩౫. బసవ పురాణము, ద్విపద
౩౬. భగవద్గీత
౩౭. భరత నాట్య శాస్త్రము
౩౮. భారతి సంచికలు
౩౯. భాస్కర రామాయణము
౪౦. భోజ రాజీయము
౪౧. రంగనాథ రామాయణము
౪౨. వావిళ్ల సన్మాన సంపుటము
౪౩. విజయ తోరణము
౪౪. వీర శైవాంధ్ర వాఙ్మయము
౪౫. వ్యాస సంగ్రహము
౪౬. శుకసప్తతి
౪౭. సంకీర్తన లక్షణము
౪౮. సంగీత రత్నాకరము
౪౯. సంగీత సుధాకరము

౫౦. సారంగధర చరిత్రము యక్షగానము
౫౧. సాహిత్య దర్పణము
౫౨. సింహాసన ద్వాత్రింశిక
౫౩. సీతా రామాంజనేయ సంవాదము
౫౪. సుగ్రీవ విజయ యక్షగానము
౫౫. సుభద్రా కల్యాణము
౫౬. హంస వింశతి
౫౭. హిందువుల పండుగలు
౫౮. హైందవ ధర్మ వీరులు
౫౯. క్షేత్రయ్య పదములు
౬౦. ధర్తీ గాతీహై
౬౧. మైథిలీకే లోక గీత్
౬౨. లోక సాహిత్య
౬౩. బ్రజలోక సాహిత్య కా అధ్యయన్
౬౪. గ్రామ్ గీత్
౬౫. ధీరే బహో గంగా
౬౬. గాయెజా హిందుస్థాన్
౬౭. బాజత్ ఆవెఢోల్
౬౮. కవితా కౌముదీ
౬౯. ముంతఖబులుబాబ్
౭౦. The Popular Ballad
౭౧. The Ballad in Literature
౭౨. Animal Folk-songs for Children
౭౩. English & Scottish Ballads
౭౪. Music in Telugu Folk-songs
౭౫. Meet my people
౭౬. The Encyclopaedia Britannica
౭౭. The Encyclopaedia Americana
౭౮. Vedic Mythology
౭౯. South Indian Hours
౮౦. The castes and the tribes of the H. E. H. The Nizams Dominions
౮౧. Castes and tribes of South India
౮౨. The Reddis of the Bison Hills
౮౩. The Chenchus
౮౪. Historic land marks of Deccan
౮౫. South Indian History
౮౬. History of the rulers of Jinji
౮౭. History of Deccan
౮౮. The History of the Reddi Kingdoms
౮౯. Our Faithful Ally the Nizam
౯౦. Ballad and the Sources
౯౧. America Sings
౯౨. Field songs of Chattis Garh
౯౩. The march of India Vol II. No. I 1952
౯౪. The Indian Antiquary Vol. III 1874, Vol. XXXIV 1905, Vol XXXV 1906
౯౫. The Illustrated weekly of India Nov. 1944
౯౬. Asiatic Journal Vol. 34, 1841.

# అనుక్రమణిక